# A FOOL
# &
# HIS FAMILY.

## దుర్మార్గచరిత్రము

విష్ణుభట్లసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపఁబడి

ఏలూరు.

---

మంజువాణీముద్రాక్షరశాలయందు

ముద్రించిప్రకటించఁబడినది.

---

1906 సం॥

Price 4 As. 

శ్రీ

సప్తకోటీశ్వర స్వామినేనమః.

# దుర్మార్గ చరిత్రము


మానితధవళాంగా।
వామోన్నతవృషతురంగవనధినిషంగా।
ధీమన్మనోబ్జభృంగా।
కామాంగవిభంగమల్లికార్జునలింగా॥ 1

వ॥ అవధరింపుము సకలదుర్గుణ ధుర్యుండగు సాతాని చెవిటిబస
వయ్యాచార్యవర్యునకు హీనవిశ్వస్తాభుజంగుండగు జంగమ
మూగపెరుమాళ్ళలింగమిట్లనియె॥ 2

సీ॥ భుగభుగధ్వనియుతభూరివైశ్వానర,
జ్వాలాంతగతకుణపవ్రజంబు।
బహుతరజీర్ణశూర్పచ్ఛన్నదగ్ధాస్థి,
సహితదుర్గంధభస్మవ్రజంబు।

సర్ధదగ్ధవిదళితానేకవంశభి,
త్తిచయసంవ్యాప్తసూత్రవ్రజంబు,
బల్యన్నభక్షణప్రచురలాలసకూజి,
తబహుళాలిష్టగృధ్రవ్రజంబు॥

గీ॥ విపులఫేరవరవభయవిశ్రుతంబు।
లాన్యభూతప్రభూతభీలాలితంబు।
విమలగంగాతరంగమహితాని।
లాభిహితపితృవనభూతలాంతమందు॥ 3

వ॥ సత్యవచన సముద్భూత సమజ్ఞాసాంద్రుండగు హరిశ్చంద్రుం డున్న సమయంబున నజ్ఞానవిలోకియగు నవివేకియన ధరామరుండరుదెంచి సపర్యలనానందిత హృదయారవిందుండయ్యె నయ్యెడ నద్ధరణిపురందరుండు తనడెంపంబునంగల కొంద లంబునంగుంది కందినయనారవిందంబుల నశ్రుబిందుసందోహంబులుచిందమందమందస్వరంబున నవ్వసుంధరాబృందారకునితోడ నిట్లనియె॥ 4

క॥ దారుణవిభవముబంధుల।
దారసుతుత్తురెడఁబాసితప్పని మఃప్పల।
ఘోరశ్మశానముననే।
హారముగనునన్నుఁబోలువాఁడుంగలఁడే॥ 5

క॥ విభవాన్వితమద్వంశ।
ప్రభువులలోలెక్కకొక్కప్రభువైననుశో।

కభరయుతుండు "సభూతో।
సభవిష్యతిమత్సమోస్తు" నాజనువిహా॥ 6

వ॥ అనినవివేకి యిట్టులనియె॥ 7

చ॥ ఒకతరిచండుఁడై నరవియొక్కతరిఁ ఖరకాంతిఁ బోయఁడే
యొకతరి వెల్గుచున్న శశియొక్క తరిఁ గృశతన్వసింపఁడే।
ప్రకటితశౌర్యసంపదలు పాయుచువచ్చుచునుండుఁ గానసీ।
వికవెతనొందకయ్య గననెంతటివారలుఁ గష్టమొందరే। 8

గీ॥ కాంతలను బాసి పదవులఁ గరముఁ గోసి।
విపినములఁ డాసి పొందుచు నెపుడు గాసి।
హరిహరబ్రహ్మలుంగూడ నహరహంబు।
మనుటపూర్వకాలమునందు వినమె కనమె॥ 9

క॥ అనవిని యినకులచంద్రుఁడు।
మనమునఁ గడువింతనొంది మన్ననబల్కెన్।
వినుపింపుమయ్య యీకథ।
గనవారలకష్టములకుఁ గారణమెదో॥ 10

క॥ నావిని భూసురవర్యుఁడు।
భావంబునమెచ్చి యిట్లుపలుకఁదొడంగెన్।
శ్రీవిన్ దుర్మార్గాఖ్యుని।
భూవిభుని ప్రభుత్వమందుఁ బుట్టెంజెట్టల్॥ 11

వ॥ అనినసమ్మహీధవుండిట్లనియె, దుర్మార్గుండను తేడెవండు, వానిరా
జ్యంబెట్టిది, పత్తనంబేది యతనిరాజ్యంబువలన మువ్వురవేల్పు

ల కెటుల వెతలు పుట్టె, నవి స్తరంబుగ జెప్పవే యనిన నమ్మహీసు
రుండిట్లనిచెప్పఁదొడంగె॥ 12

శా॥ శ్రీమద్వాయసఘూకఘూర్ణితపిపచ్ఛిప్రపూర్ణగేహంబునన్।
ద్దామత్వీత్రిచతుష్షడష్టదశశాద్ద్రప్రక్రియాత్యంతమః।
భామంగళ్యవికీర్ణధిష్ణ్యమును నానామేయవన్యామయా।
స్థేమస్వాంతమరంతతాపసృగణాశ్లేష్టంబసౌఖ్యాఖ్యచే॥

ఆ॥ ఒక్కకోటికయొలయు నొగిమెఱుంగుడుబుఱ్ఱ
ములడ్డిచీకువాలు మొనయువెలుఁగు
నూజఁజీలికన్ను తేజునసబుబరం
బగుచుపీటి పజలుమిగులఁబొగడ॥ 14

క॥ మెఱుఁగుడులుజీలులూఖులు।
పరిసృపములురగవరులుఁజలువగుఱాల్వా
గురికలుఁగడుముస్తలమే
పరులున్గలవా పురమున బహుసంఖ్యలుగన్ 15

గీ॥ మొండిగోడలు చవుడులుసందుదొడ్లు
పాడుబొందలు మిట్టలుపల్లములును
గలతెరవులును బందులుకలఁచునట్టి
గుంటలేవంకనుండును గోట్లకొలది॥ 16

గీ॥ ఇట్టిపురమునఁ గుజనులయినట్టిపెద్ద
వారువాసంబుగానుండివాంఛతోడ
మిన్నుమన్నునుదెలియక మెలఁగుచుంద్రు
పేడకుప్పలోపురువులవిధముగాఁగ॥ 17

గీ॥ పదుకట్లసవారుల కెచ్చులయిన
నూటిబాజాలకెంతేని లోటుసున్న
చావుఁగూడులు కుడిచినజన్నగట్ల
మూకకాకులతోఁ గూడవీకబలిసె॥ 18

చ॥ తనకతిదాహమంచొకతె ధారుణిఁ గొడ్డువిధానఁ జచ్చెఁగా
తనసుతుభ్రష్టుఁడంచొకతె ధర్మపురంబున విందుపెట్టకై
తనపితయేగెనంచొకతె తెల్పఁగనిర్వథిబోట్లుపయికిఁదా
మనయము బ్రోవఁడవలె నార్చెదరాపురిగీముగీములన్॥ 19

చ॥ చెలువుదలిర్పఁ శోణ మగుచేలము పాదము నంటి వ్రేలఁగుం
తలగణమింత పెంబొదవిధంబున గ్రాలనజస్రమశ్రుధా
రలు నయనంబులన్వెడలి వ్రాలవసించుఁగ వీంద్రగుతోటన
క్కలుములగొంతి యక్కకలకాలము నాపురిగీముగీములన్॥

సీ॥ అచటిబాపలకొక్క యక్కరముపలికి,
పొట్టనేమూలను బొడిచిగనిన।
నచటిరాచకొలంబు లబ్టెయురుకుచుండు,
చీమచిటుకుమన్న జెందిభీతి।
నచటిమూఁడవకులం బఱచేతిలోనవై,
కుంతంబుఁజూపించి కొంగ్రుసొమ్ము।
నచటిబల్రిజెలుధ రామకులధనంబుఁ,
బొడిబెల్లమువలెఁ బొక్కుచుండ్రు।

గీ॥ అచటివారకాంతలుకోతులందమంత।
మించినాట్యంబు సేయుచు మెలఁగుచుండ్రు।

అచటఁబుట్టినబంగారమరయమన్న।
నచటఁబుట్టినయుక్తినరయఁజెదల॥ 21

గీ॥ పారవైచినవిస్తరిఁబజ్జచేరి।
కుక్కలొండొండు పోట్లాడుకొనెడుమాడ్కి।
నాపురవుఁబాపలెల్లరుకోపమునను।
బ్రతివిషయమునఁ బోట్లాడిపరగుచుండ్రు॥ 22

గీ॥ కోర్కినొక్కఁడొక్కఁడు కొట్టుకొనుచునష్ట।
యాలిబూతులలెస్సఁగాఁబ్రేలికొనుచు।
ముష్టియుద్ధంబు నొనరింత్రు భూదివిజులు।
బడుగులైనను వారలుఁ బిడుగులౌర॥ 23

॥ఆ దళముశివునిమీఁదతలఁపునానలమీఁద।
నుంచికొంగజపము నొనరసలిపి।
వెలియటండ్రియతుల వలెనుబీదలసత్త।
కట్లవిధపలచటస్వావిబుధులు॥ 24

క॥ బుడిచెంబులు చేతంగొని।
మడిసంచులమూఁపునిడిమానికలనుబోల్।
పొడికాయల గ్రొండినిడి।
బుడబుడసంభాషణలకుఁబోమురుపారుల్॥ 25

తే॥ కాళ్ళనెత్తెత్తివేయుచు గంతులిడుచు।
నింగిచుక్కలనెన్నంగనేర్పఱులము।
టంచుదొంగపాత్ర్యములాడి సంచరింత్రు।
ధరణిగోముఖవ్యాఘ్రులద్వైతులచట॥ 26

ఆ॥ మోముపట్టుఁబట్టనామాలుకడుఁబెట్టి।
జుట్టుసాగదీసి చిట్టుముడిని।
జుట్టియంచుబట్ట కట్టుదుర్ వైష్ణవుల్।
పొట్టనక్కరంబు పుట్టుకుండ॥ 27

ఉ॥ పేరురమందు వ్రేల తెగవ్రేసెదులింగముగట్టి పెద్దఘూ।
ర్జారవునందియుంగరముజుట్టన వ్రేలికిఁబెట్టి వెఱ్ఱియా।
చారముబట్టిస్తోత్రులను సాపదువేళల నెట్టిపొట్టనిం।
డారఁగనుల్లిగడ్డలను హాయిగతిందురుశయివులప్పరిన్॥ 28

తే॥ మొగమునందున మేలెల్ల ముద్రలుంచి।
యిలనుగాయత్రిఁజెప్పంగ నెచటొవిన్న।
దానివలెనున్న దనియందు ద్వైతులచట।
వసుధబేకులసాకుల వారువారు॥ 29

తే॥ అన్నృతమాడుటే లౌక్యమటంచునెంచి।
పొట్టనేవంకనుబొడిచి పొడిచిగనిన।
నక్కరములేక నేయుంచు రచటిలౌక్య।
లక్షరాలవిధవ లయ్యెలక్షలేల॥ 30

సీ॥ అందుందుదిరుగాడు నడవిపిల్లులజూచి,
గొందెలఁబడుశ్వానబృందములను।
నచ్చటఁగలయూరఁ బిచ్చుకలఁగనియిల్,
చొచ్చెడుశ్యేనసముచ్చయముల।
నవ్వీటఁగలపేడ బుర్వులఁగనిగూళ్లు,
జివ్వనఁబడుకాలి చివ్వగముల।

నక్కడకలలోన బక్కవారలఁగాంచి,
త్రొక్కుడుల్ పడునట్టిమొక్కలులను।

గీ॥ నిహపరంబులుగా నెంచియెవ్వ రేమి।
సుద్దు చెప్పినను వినక మొద్దులు గతి।
శిలలచందానఁ దిండితిప్పలను లేక।
కాలమును బుత్తురచటి నృపాలవరులు॥ 31

తే॥ కోరమీసముల్ దువ్వుచు కుక్కజాతి।
నూరఁబందుల పై కెగఁబారనిస్స।
లంచుఁ బురికొల్పుదు రచటి యువనివతులు।
మూలనున్న ముసలిదాని మోదినట్లు॥ 32

చ॥ మిరియములున్న వేయనిన మొంతులుగావలె నేయటంచు గొం
దపుఁ గడు మంచియైన తరుద్రవ్యములం దునఁ జెత్తనించి ఫ
స్టురకమటంచుఁ గొందరు విశుద్ధపు వస్తువు దెమ్మటన్న మం
దిరమున కేగి యుద్దెకొని తెత్తురు కొందరు వైశ్యులప్పురిన్॥ 33

చ॥ హలమను పేరెఱుంగరు బుధావళి పల్కిన భూషణంబులన్।
గలనయినం దలంపరర కానికి నెన్నియొ మాలకూడులన్।
జెలఁగి భుజించువారలకు జేతుల నొగ్గుచుఁ జెడ్డ సేతులన్।
సలుపఁగడంగుచుండ్రచటి నాలవజాతి విజాతి జాతమై॥ 34

గీ॥ రామరామాయటంచు విరాను మేఘు।
లేక దశావిధావస్థల లీలబడలి।
యరయ సూర్యశ్చ కగ్నిశ్చ యనుచుఁ దప్పఁ।
జెప్పుదురు మతిలేమి సచ్ఛిష్యులచట॥ 35

ఆ॥ ఒకనిచూడకుండసుకనినాహ్వానించి।
యొకనిసరసకేగుచుండియొకని।
తోడనుగుసగుసలనాడి వేరొక్కని।
కలిసికొంద్రుధనముగణికలచట॥ 36

గీ॥ గురువులఘువులెఱుంగనిగొప్పకవులు।
ఆఱుమూడుకల్పలేనియట్టిలాక్ష్యు।
శ్రెష్టురామశబ్దమురానిపుట్టుశాస్త్రి।
లుందురటనేతిబీరకాయోపమలుగను॥ 37

వె॥ తానిషాలనాడు దాచినయాజ్యంబు।
హాస్తులుతిన బియ్యమన్నముష్పా।
కారమదిలేనికూరకేనతుత్ర।
మంత్రువంటలమ్మలక్కలచట॥ 38

సీ॥ రంకులాడేనియు సుంకంబుచెల్లింపఁ,
గొనిపిడిగంటలఁ గొట్టువారు।
వేదాంతులమటంచు విధవలకుమునుంగు,
వేసియుగ్రోజముల్ వెతకువారు।
ఇలనుస్వహస్తపా కులమంచుపిండివం,
టలపట్లనియమంబుతోలఁగువారు।
చదువురాకున్ననుశాస్త్రిబిరుదముల్,
మాత్రంబువిడువకమనెడువారు।

గీ. ప్రేలనున్నపొగడికయుమోముఁద్రిప్పఁ
గాంచియేమొత్తల్పించినిందించువారు।

నోటితోడ మాట్లాడుచు నొసలతోడ।
వెక్కిరించువారెన్న నవ్వీటిజనులు। 39

సీ. దారమీఁద నుదప్పిదము మోపి విడనాడి,
వలపుసానుల యిండ్ల మెలఁగువారు।
కాశికేగెదమంచు గాసులనార్జించి,
గోపడంతులకిచ్చి మ్రొక్కువారు।
సొగసుగా నలరారు సుదతి పోవుచునుండ,
ఱెప్పవేయక చూచు గొప్పవారు।
ఆలి చెప్పిన కొండెమాలించి కోపాన,
మాతృదేవిని గొట్టి మనెడువారు।
పూర్వులార్జించి పెట్టిన భూములన్ని।
వ్యాజ్యములకు సమర్పించి వరలువారు।
కలఁగఁ గోటానకోటులు కలిపురుషుని।
యంశలనుగాని వచ్చిరో యనఁగ నచట॥ 40

సీ. కల్లుఁ ద్రావిననాడు కంపు గొట్టునటంచు,
నుల్లిపాయలఁ దినుచుండువారు।
పరధనం బెత్తుట పాడిగాదని పెంకు,
టిండ్లకు నిప్పంటించువారు।
అన్యులమది నెవ్వనాడిన కీడని,
తోడఁబుట్టుకలను ద్రుంచువారు।
జారత్వ మెన్నఁడు సల్పరాదని పావి,
తప్పి కాంతల బల్మిఁ దపులువారు।

గీ. లేనిపోనిప్రలాపముల్ మానవలయు।
నంచుఁగడుకూటసాక్ష్యంబులాడువారు।
నిందజేసినెక్కిచెప్పంగనందునుండు।
పండితంమన్యులకెగాకపరులకగునె॥ 41

ఉ॥ క్షాత్రికులుబ్ధపర్ణగణఘోరులుదుర్గమకాననాద్రిసం।
చారులుకల్మషాత్మతవిచారులుసత్కులపాళికాళిసం।
హారులుహేయదుష్పథవిహారులుబాలిశమత్తకాముకా।
ధారులుద్రోహిణీశ్వరవిదారులుచోరులుపౌరులారయా॥ 42

ఉ॥ అందరుధూర్తవర్తనులెయందరుదుఃఖనిమగ్నచిత్తులే।
యందరుసౌఖ్యనాశనులెయందఱుస్త్రీద్రవిణాభిలాషులే।
యందఱుప్రాణిహింసకులెయందరుదుష్టగణోపకారులే।
యందఱుజారచోరులెయందఱుపౌరులుకాలచేరులే॥ 43

ఉ॥ మేముధనాగ్రగణ్యులము మేముసదన్వయజాతసంచితో।
ద్భవయశఃప్రపూర్ణులము మేముగజద్విడహీనశౌర్యుల।
క్షీమహితోత్తమాంశులము మేముసమస్తకళావిచక్షణో।
ద్ధాములమందుకల్పులెకదాదురహంక్రియనొందిసిక్షుటల్॥44

చ. గురువులపాదరక్షలనుగూలఁగఁగొట్టనివాఁడునాపురిం।
బకలకుఁగీడుచేసెడుస్వభావముమానినవాఁడునెప్డుసో।
దరభరణంబుదక్కపెరదారినిఁబోవనివాఁడుకోటికిన్।
క్కరుఁడునుగానరాఁడుకలకాలమదేపనిగాఁగఁగాంచినన్॥45

ఉ. క్రూరులుజారులుందలఁపఘోరులుచోరులువారలైనసె।
వ్వారికినొక్కయొక్కరపువాసనలేదొకవేళనుండినన్।

భారము మోయుగాడిదలభంగి జరింపుచు శాస్త్రమర్మముల్।
తీరుగ నారసంబడరఁ దెంపున యుద్ధ మొనర్తు రొండొరుల్॥ 46

సీ॥ వ్యాజ్యమాడిన వాఁడు వనటగుందఁగ వచ్చి,
మునిమ్రోలఁ జక్కెర దినెడు వారు।
కూడ్రవచ్చిన వాఁడు గోలపెట్టుచునుండ,
చివ్వసవకవక నవ్వువారు!
గీము గాలిన వాఁడు ఘోష మొందుచునుండ,
పొంచి సొత్తులసంగ్రహించు వారు!
పనియున్న వేళ బాబని వేడియూవెన్క,
విధవాయటంచునుఁ బిలుచు వారు!
గీ॥ అందివచ్చినసిగయును సందకున్న।
గొంకు లేక కాళ్ళను బట్టుకొనెడు వారు।
కరము పలుగాకిముండలసరస చేరి।
స్వాతిశయమ్ము నెచ్చెప్పువారచటిజనులు॥ 47

సీ॥ కొడుకు పెండ్లిని జేసికొనుమఁ బూజింపకు,
పేరమ్మకును వెలి వేసినాఁడ।
వేటకేగుచునుండ విధిగోనదుర్రైన,
తంబులశాయినిఁ దన్నినాఁడ।
నాకోర్కి దీర్పనికాక చేబోగము,
కమలాక్షి గేహంబుఁ గాల్చినాఁడ।
నేమాయియనిపిల్వకోమటిలక్ష్మాయి,
నీడ్చిచెంపలను వాయించినాఁడ॥

గీ॥ మొన్నతీండ్రాలకుంజనిముసలిపోవు।
దమ్మహారలఁజెక్కెంద్రఁదాకినాఁడ।
ననుచుఁబ్రతిబాడబుఁడుభూపుఁడర్యకులుఁడు।
పాదజుఁడుపుల్కసుఁడుపగ్గెపల్కుచుండ్రు॥ 48

సీ॥ ఫీజుతేదనుమాటవెత్తియొక్కటిగాని,
ప్లీడర్లువారికిజోడుగారు।
జీతంబులేదన్నజిన్నిమాటయెగాని,
జడ్జీలువారికిసములుగారు।
అఫీకారమొక్కటియబ్బదుగానిమే,
జస్టీస్లువారికిసాటిగారు।
రాజ్యమేచందానపూజ్యమొక్కటిగాని,
భూపతుల్ వారికిఁబురుడుగారు।

గీ॥ కాళయుక్తిగవాదముల్ నడఁగునపుడు।
పరులకెంతేనితీర్పులుపలుకునపుడు।
సుందరులమీఁదతమశక్తిఁజూపునపుడు।
సొంతతిన్నపైకీవిఁగూర్చుండునపుడు॥ 49

సీ. పతియింటిలోపలపాదంబుపెట్టంగ
గాంచితిట్లకుపక్రమించువారు।
కలనకుహేతువైగవ్వలైననుగాని,
పొల్లువల్కులప్రొద్దుపుచ్చువారు।
వేసులదిగనాఁడిపిల్లిపైయెలుకపై,
బెట్టియుసూర్యలఁజావతిట్టువారు।

నగలు లేవనునట్టిమగని పైకిసుక చే
కూర్చి బిడ్డలఁబట్టిగొట్టువారు।

గీ॥ ఒకరిమాటల నొకరితో నొనరచెప్పి।
వీరి వారికి జగడాలు పెట్టువారు।
వరుల మర్యాదతలఁ పకబావియొద్ద।
తమ ప్రతాపమాడెడు వారుతరుణులచట॥ 50

గీ॥ వరుసచెంబుతప్పెలలను బగుల వేసి।
బిచ్చగాండ్రను వదితిట్టిబిడ్డలఁ గడు।
గొట్టిన నటిచటి స్త్రీలకుఁ గోపమార।
దావగింజంత యేనియు నథివవించె॥ 51

చ॥ వరలెడువాఁడు గ్రామమున వన్నెకు నెక్కఁగలాఁడు తల్పగన్।
బరవము వాఁడు చావఁగను వ్యాళెము కైవడి వానికాంతయు।
ద్ధరమను బెక్కువర్షములు తావతిజీవముఁ గొంచునిట్టులం।
గరము విభూతినొందె ననఁగష్టలు కంచెలఁ బొఱ్ఱవైచుచున్॥

క॥ అపత్తనంబు సందగు।
పాపంబుల వ్రాయఁ జిత్రుబదులుగఁ జిత్రిం।
బాపంబు విచారింపఁగ।
శ్రీపతి పంచెదము నమ్య స్పెషలధికారిన్॥ 53

వ॥ అప్పురంబున స్వర్ణలవణచ్ఛత్ర వస్త్రశస్త్రిక రుద్రాక్షపాద రక్షాద్యఖిల వస్తుస్తోమ స్తేయ క్రియా చాతుర్యాసాది తాం హోహాసమాజ్ఞానూనా మేయా నంతాశాంతా కాంతా త్యం తవర్ణనీయధ్వాంత పరిభావితకజ్జలఖంజన కాళిందీకృష్ణ సా

రతమాలహాలా హాలకాలమార్జాల బలాహకద్రోణ కాక
ప్రకర ప్రకాశుండును, ఆచ్ఛాదన విహారసమయాభీల కర
వాలవిదార్యమాణ బస్తోరభ్రభృన్నై చికీ శశకీ శశశాదనసారంగ
వృషభమకసృగాలబిడాల విట్చరేట్చర క్రకరప్రకరవ పూర్జని
తలోహితబిందుసందోహ సంపాన మత్తకాక గృధ్రకోలాహ
లబధరీకృత దిఙ్మండ లుండును, ప్రేష్యతర్జన గర్జన భర్జనస
మార్జితా సంతాపాతురధావన్నిఖిలాశా నమాగత వనీపకస
మూహుండును, ఆసేతుహిమాచల మధ్యాఖండ భూమండ
లస్థదివ్యభవ్య పుణ్యక్షేత్ర యాత్రాయాత సద్బాడబకేదా
రకాదంబినీ ఝంఝూనిలుండును, హితామాత్య పురోహిత
దర్శకసేవక భారిక నైష్కికాంతర్వంశికశుక మనోరథవల్లరీ
కరిణాపూరణీ ధరణీరుహుండును, పిశునదుర్జన ఘాతుకవంచ
కప్రూరితయథాజాత మితంపచమలి మ్లుచరక్షణదీక్షాబద్ధకం
కణుండును, విప్రకృతసుచరిత్రా నికర మనోవ్యథమాత్ర
దైనందిన క్షీణాయుర్ధన సంపద్విశేష చలితస్వాంతుండును,
క్షుద్రవనితాక్షీణ వికటకటాక్షవీక్షణా శనిజత శరీరమహీధ
రుండును, తిరస్కారకుపితసకలసుకవినికరభీషణపరుషభాషావి
శేషశప్తుండును నీచానర్థోన్మత్తప్రలాపకలాప నిష్ఫలీకృతస
ర్వకాలసర్వావస్థుండును నగుదుర్మార్గుండను పేరుదుర్గుణంబుల
న్నియుమూర్తిభవించెనోయనవెలయుచుండు॥ 54

సీ. అఖిలదుర్గుణములకందివేసినచేయి,

యంహములకునిధానలమైనదుంప!

పరుల నుబీడించుపనికి పెట్టినపేరు,
దొంగతనమునకుఁ దొల్లి వేల్పు।
పెంకుటిండ్లకు నగ్గిపేర్చడమున మేటి,
బఁడబూతులను బేర్వడిన పెద్ద।
విబుధులపాలిట వెలసిన రాకాసి,
పెండిండ్లు పడఁగొట్టు పీడవిధవ।
గీ. పుట్టినట్టిబిడ్డకుఁ బేరు పెట్టినవాఁడు।
తిన్న యింటికి వాసాలనెన్ను వాఁడు।
జుట్టుజట్లకు ముడిపెట్టఁ జూచువాఁడు।
కాఁడె దుర్మార్గనాముఁడు ధాత్రీతలమున॥ 55
ఉ॥ జారులలోపలన్ ఘనుఁడసత్యపువాదులలోనపెద్దవల్।
చోరులకెల్ల మేటివటుజూదరగాండ్రకునెల్లసద్గురుం।
డారయవాంతకావళికినాద్యుఁడుదుష్టులులోనరాజుదు।
భ్రష్టాకరులలోనఁబేరుగలకూళయతండుదలంపవల్పుడే॥ 56
ఉ॥ మెండుగపారులంగెడపి మేదినిసత్యమురూపుమాపి పె।
న్గొండలడాగిపాంథులనుగొట్టిగృహంబులనెల్లనగ్గికిం।
బండువుసేసిరుష్టులసెబాసనిమెచ్చిఘనంపుఁజూడ్కులన్।
మిండలఁబండలన్గనియుపేరువహించెనతండునీచుఁడే॥ 57
ఉ॥ గొట్టునుదల్లిదండ్రులను గొంకక యిచ్చునొకింతయేనియుం।
బెట్టునుబీదసాదలను బేరిముడిపీడుచుముప్పతిప్పలం।
దిట్టునుదండిపండితుల దిక్కుమొగంబయిపెద్దపెట్టుగా।
మొట్టునుసేవకాజనము మోదముదక్కుచుఖేదమొందఁగన్॥

ఉ॥ ఎప్పుడుజీవహింసలకు నేగును దారుణపావకర్ముఁడై।
ముప్పుఘటింపఁజేయుజనుమూలలదాగినవారినేనియుం।
దప్పులులేకపోయినను దప్పులు మోపుచుఁ బుణ్యకాంతలన్।
గొప్పులుపట్టియీడ్చుకడుకోపియతండుధరాతలంబునన్॥ 59

గీ॥ చూడవచ్చినచుట్టాలనాడువారి।
నింటనుంచి రేయిబి నొడలెల్లతడవి।
చాచిపుస్తెపూసలఁద్రెంచిసురనునమ్మి।
వాంద్రకిడుఁజూకలకుగొట్టివాఁడుమివ్వుల॥ 60

గీ॥ అన్నమోరామచంద్రాయటంచుఁదిరుగు।
వారిచేఁబన్నులనుగొంచుఁబైకమెల్ల।
యిచ్చకముఁజెప్పుధనికునికిచ్చివేయు।
కాకిఁగొట్టిగ్రద్దకువేయుకరణిధరణి॥ 61

గీ॥ తెలివిగలవారలేరైరెనదిగువనుండ।
నున్నతాసనమునకెక్కనోటలేక।
మత్తనాగపంచాస్యముల్ మహినిఁదిరుగ।
చెట్టుకొనకొమ్మలకుఁగోతిచేరునట్లు॥ 62

క॥ పనిలేకపోయినను దాఁ।
బనికల్పించుకొనిపోవుఁబ్రతిగృహమునకుం।
గనమొకుగుడులనుజీలుఖుఁ
జనవేపనిలేకపెక్కుసదనంబులకున్॥ 63

గీ॥ పుడమివారకాంతలుసొమ్ముపుచ్చుకొనుచు।
నియ్యలేదనివానిని నేడిపింప।
వాఁడుసంసారసతులకుఁబైసయేని।
నియ్యకనెయిచ్చితినటంచునేడిపించు॥ 64

సీ॥ తనుదానుస్తుతియించుకొనుచుండునెవఁడన్న,
జుట్టనవ్రేలేనితట్టుఁడగుఁగు।
భీదసాదలఁగాంచిపీడించునెవఁడన్న,
దృగ్యుగంబెవ్వానిదిక్కుఁగనును।
వనితలకడకల్లలనుఁబ్రేలునెవఁడన్న,
నలజింపహ్వాయెవ్వనియాఖ్యనెత్తు!
జూదానఁజేరుసంపాదించెనెవఁడన్న,
వక్త్రాబ్జమెవ్వానిపై పుమరలు।

గీ॥ నెల్లదుర్గుణంబులకుఁబుట్టిల్లెవండ।
టన్నడెందమెవ్వానినేమెన్నఁబోవు।
నట్టిదుర్మార్గనామకుఁడీయవనిలోన।
నరుఁడుమాత్రుఁడేతలఁపవానరుఁడుగాని॥ 65

సీ॥ పుట్టెడుకల్లునీపొట్టఁబెట్టితినంచు,
బట్టనెత్తినొకతెమొట్టుచుండ।
బట్టినిఁబట్టిచంపఁగనెట్టిరోగంబు,
పుట్టెనీకనియొకర్తుతిట్టుచుండఁ।

గట్టబట్టలు లేనిపట్టుల నేయుండుఁ,
బట్టనంచొక్కటెనెట్టుచుండఁ।
జుట్ట నిప్పిచ్చుటఁబుట్టఁబోదనియూష్పఁ,
గట్టచేనొక లేమక్కొట్టుచుండ।

గీ॥ వాఁడునిశవేళలనుదొంగవానిబోలెఁ।
గడుపికారులుసేయుచుఁగాంతలలుక।
మొకముపైఁజల్లుపేడనీళ్ళకలరితన।
యట్టివారేరులేరంచుమిట్టిపడును॥ 66

సీ॥ మాయప్ప దెమ్మునీమచ్చమాయనటంచు,
నిరతంబుఁదిట్టనినీచుఁడొకఁడు।
మాయుసుకుదవిలిమడిసిపోమవటంచు,
దుమ్మెత్తిపోయునిధూర్తుఁడొకఁడు।
భార్యకునాకెడబాపితినీవింక,
మనుదువేయుననట్టిమనుజుఁడొకఁడు।
నీవుగాల్చినఋండ్లునెగడలేదింతకు,
సరిలెమ్మనినయట్టిజనుడొకండు।

గీ॥ లేదువానిఁజూచినవేళవీడునందు
జననకాలమెట్టిదోగానిగనఁగరాదు।
ధరణిపతులైనమర్యాదఁదప్పినయెడ।
గుడ్డిగవ్వకుఁగొరగారుక్షోణియందు॥ 67

గీ॥ భువినినాకంటెఁ దోత్తముండెవఁడటంచు|
నలువయడుగవానినిఁ జూపినాటనుండి
తర్జనీకరశాఖప్రాంతంబుగాక|
పరగలేకున్న నది సేయుఁ బాప మేమి॥ 68

గీ॥ ఉగ్గుపాలతోనీగొనాలుదయమయ్యె|
మొడ్డిదొడ్డిఁగొజిల్లేళ్ళు మొలచుమాడ్కి|
ప్రతిదినంబునవింతగఁ బ్రబలసాగె|
బొమ్మజెముడులునానాటఁ బొల్చుపగిది॥ 69

క॥ ఇమ్మహిఁదుర్గాగుణచ|
యమ్ములఁగొనికొట్టితిట్టియుడలు పఱిచివన్|
హుమ్మనితనతలయెత్తును|
బొమ్మజెముడులు తెగనరకఁ బొల్చకయున్నే॥ 70

ఉ॥ ఎప్పుడువచ్చునోయిలుకు నెప్పుడుగీములనంట పెట్టునో|
యెప్పుడుగొట్టునో మునల నెప్పుడువృద్ధులఁ బట్టిచంపునో|
యెప్పుడు చెండునో శిశుల నెప్పుడు గొడ్డులఁ జావమోదునో
యిప్పురినుండ లేమనుచు నేడ్చెద రెంతయు వాని బాధలన్॥ 71

గీ॥ శబరుఁ డిలకించు పక్షులచయము వ్రాలె|
బిల్లిఁ బరికించు నాఖులపిండుమాడ్కి|
విషధరముఁ జూచు మండూకనిసరమట్లు|
కలవరించు దుర్గానిఁ గాంచు జనము॥ 72

వ॥ ఇత్తెఱంగునఁ బ్రజలు వేఱువునొంద నిఖిలసద్గుణంబులు నిత
ని వైకేకాఁబోలు పుట్టినసయాశ్చర్యమొంద ధూమకేతువు
ప్రకటున చందంబున రాజ్యంబు పూజ్యంబుగఁ బరిపాలింపు
చుండెనత్తరి నతనిసన్నిధానంబునకు గోభక్షకుని సమక్షంబు
నకు నరభక్షకుఁడు వ్రాలె ముష్టిఘాతమాత్ర మరణిత నానా
మృగజాతుండును, దండప్రహార పీడిత నిఖిల పుణ్యక్షేత్ర
యాత్రికలిత ధరణీబృందారకబృందుండును, నిజకోప
ధానల హావిర్భూతఘటిత సజ్జనప్రాణవిసంజ్ఞుండును, శశ్వద్దహ
నిత గృహారామనిచయుండును, స్వమాతృకామవిచ్ఛేదకుండు
ను, తిర్యఙ్మాత్రుండును నగుముక్తోభయను విప్రుండరుదెంచి॥

మ॥ కనిరెల్లోపహిత శత్రుసుష్కృత మనఃకంజాతసన్మిత్రుఁగ।
ర్ధసంఘస్తుతిపాత్రు స్వాన్వయపయోరత్నాకరోద్భూతస।
జ్జంభాస్వగ్భడబాగ్నిహోత్రుఁ బటుసుశ్చారిత్రు నావిద్ధవా।
మానగాత్రుం దనమోలిఘోరతరదుర్మార్గాభిదాపాత్రునిన్॥

చ॥ హరిగుణశీలుఁ గూరిరవిక రావసలోలున శేషపూజ్య శే।
ఖరగణకాలు ఘోరతర కాననఖేలు మృషాలవాలు సం।
పరిచితక్రమజాలు గురుభావితపాపజనానుకూలు స।
ద్బురము గనాగ్రను పాలుఁగని హొంగునఁబొంగెను నింగియంటగన్

సీ॥ క్షణములో మనుని భస్మము చేసినహరుని,
ఫాలనేత్రంబుగా పాదుగాత।

కనకకశిపుఁ జీల్చికడునుగ్రమయియుండు,
నరహరిరూపునిన్న రయుగాత।
సురలెల్ల దెసలకుఁ బరువెత్తఁ జేసిన।
హాలాహలంబువిన్నేలుగాత।
మహిషాసురునిజంపిబహుభీకరంబయిన।
శాంకరితేజంబుసాకుగాత।

గీ॥ మానుచుగొల్లలకడగొల్లయట్టులరచి
మొగపుఁదుంపరల్ వర్షంబుపోల్కెఁ బడఁగ।
బుడమినాశీర్వదించినుగ్భోః మొగము।
చేటగానొప్పుదుర్మార్గుచెంతః లిచె॥ 76

క॥ వచ్చినభూసురుఁ గనుగొని।
ముచ్చటకుమార్గుఁడపుడుమ్రొక్కులఁ బదివేల్।
చెచ్చెరనిడివిప్రాగ్రణి।
యెచ్చోటనుబాసివచ్చితీవిచ్చటకిన్॥ 77

గీ॥ కోటివరహాలనీయకుర్గుణధురీణ।
విన్నుఁబోలెడుశుంఠనానిలయమునకు
వచ్చునేనేఁడమంగళవార్షికమునుఁగ।
నాకుఁగాకన్యలకుపెల్లెలోకమందు॥ 78

క॥ మీమాటలుఁశూలంబులు।
మీమెట్టినమెడశ్శ్శానమేదినిమీయం।

ఘ్యాములతోఁ యములుకిటి।
స్తోమేడితకర్ధంబు బుశుంతాధ్యతా॥ 79

శా॥ ఏయే వేశ్యగణంబునారసితి రేయేశిష్టులం దిట్టినా।
రేయేకొంపలయందుఁ జిచ్చిడితి రేయే చెర్వులంబూడ్చినా।
రేయేదారులకంపఁ గొట్టితిరి, యేయేతోటలంబీకినా।
రాయా కష్టవిరుద్ధ చేష్టలను భ్రష్టా నాకుఁ జెప్పంగదే॥ 80

వ॥ అని యిట్లు దుర్మార్గుండు విన్నవింప దుర్బోధితల నాడించి
తన వ్రతాపంబు నిట్లని చెప్పం దొడంగె॥ 81

సీ. భీదసాదలగాంచి వెలిమీాక నివచించి,
లంచపుసొమ్ము గ్రహించినాఁడ।
ముందు నాకన్న తాంబూలంబుఁ గైకొన్న,
విప్రు చేతులఁ బట్టివిరచినాఁడ।
బాలరండల గర్భపాతనంబును జేసి,
వారిభూములఁ గొంచుఁ బ్రబలినాఁడ।
క్షీటలపై నున్న పెండ్లిండ్లు వడగొట్టి,
పూర్ణ ప్రతిష్టలఁ బొందినాఁడ।

గీ. కడలి మొలనూలుగా నున్న క్ష్మాతలంబు।
నందు బూతులలోఁ బేరు జెందినాఁడ।
తలలు మార్చుటలో నన్ను దాటువారు।
లెంమ లేరనిబిరుదము నొందినాఁడ॥ 82

సీ॥ కరకరమనునట్టిగారెలేనూరైన,
ఘనమొప్పఁజిటికెలోఁదినఁగనేర్తు।
బ్రాహ్మణార్థముమీద బ్రాహ్మణార్థంబును,
జెలఁగియొక్కదినానఁ జేయనేర్తు।

మాటిమాటికినిసంభావనల్ గొంటకుఁ,
గోటగోడలలీల దాటనేర్తు।
చెప్పినమాటనుజెప్పకమానాళ్ళ,
బద్ధంపుసాక్ష్యంబుపలుకనేర్తు।

గీ. కొంచెమూపిరియుండ లేదంచుఁబలికి।
పీనుఁగులఁబీనుఁగులమంటఁబెట్టనేర్తు।
విధవలకుఁదియ్యమాటలుఁకథలుసెప్పి।
కరముఁబుజ్జమున్నగఁగొరగంగి నేర్తు॥ 83

సీ॥ ముసలిముండలమీద దెసలఁజూపుటయున్న,
పల్లేరుపైబండినడకగాదె।
కనుపడతిరిపెగాండ్రనుదిట్టుటయటన్న,
నంబికొండయదండనంబుగాదె।

తప్పుసాక్ష్యముపల్కిధనములాగుటయున్న,
షడ్రసోపేతభోజనముగాదె।
తడివస్త్రములతోడ మెడలఁగోయుటయున్న,
జననముతోజనించినదిగాదె॥

గీ॥ ముక్కుపచ్చలారనిముద్దుపుత్త్రికలను।
వరుసవిక్రయించుటయున్న వ్రతముగాదె।
కుత్రమాటకుఁజెవికోసికొనుటయున్న।
నిక్కమైనపూర్వాచారఫక్కిగాదె॥ 84

సీ॥ కమలాక్షికూతురికన్నెరికంబుకై,
తిమ్మాజిరావునుదెచ్చుటందు।
రాజగోపాలుసర్వస్వంబుదోమ్మరి,
నాంచారిదేవికిప్పించుటందు।
పురుషోత్తరావాలిపుస్తెసైతముద్రెంపి,
యింటిలోపలినుండియీడ్చుటందు।
చీకటితప్పుఁజేసినవాజపేయుల,
తిమ్మినిండగుకడ్పుదింపుటందు॥

గీ॥ నాదురాయభారమునేర్పునాదుపూర్ణ।
మైనవ్యవహారచాకచక్యంబునాదు।
బాహుదండబలమునాదుపరమగుహ్య।
మైనమంత్రసానితెలివిగానవడదె॥ 85

వ॥ ఇట్లు తనప్రతాపంబును బల్కి బాలకా నీశ్రేయోభిలాషిని గాన నీకుంగొన్నిధర్మంబుల మర్మంబులుపదేశించెద సమాహిత చిత్తుండవై వినుమనియిట్లనియె॥

సీ॥ నూనూగుమీసాలురానివానికినైనఁ,
గామశాస్త్రంబునుగఱపుచుంద్రు।

పైకంబుపోయినప్రాణంబుపోనను,
వానిలోభత్వంబుఁబాపుచుంద్రు|
సకలమాకర్షించిసన్న్యాసమిప్పించి,
సత్యవిరాగులసలుపుచుంద్రు|
పలుపన్నెలుంగలవ్యాధులనంటించి,
పరలోకమునకఁబంపుచుంద్రు||

గీ|| రవనిహారకాంతలుగాననట్టివారి|
కెపుడుపాదముల్ పిసుకుచునెలమిదట్టి|
ములనువోయుచుభక్తిసేవలఁసలుపుచు|
కాలమునుబుచ్చుచుండుమాక్రూరమిన్న|| 87

ఉ|| కొంపలుగాల్చుమీవిబుధకోటులదిట్టుచుబిట్టుమొట్టుమీ|
చెంపలువేయుమీపితనుజెంతలబోగమువారినుంచుమీ|
పెంపువహింపుమీప్రజలబిడ్డలగొడ్డులజావమోదుమీ|
కంపలుదార్లకడ్డముగఁగట్టుచుమర్త్యులదోచుకోజుమీ|| 88

మ|| పరదారాగమనంబుఁగోరిసతులంపల్మారువీక్షింపుమా|
పరవాసంబునుజేరిసాదముబలేబాగంచుభక్షింపుమా|
పరులేరైనజనంగజూచిముదమొప్పన్ దారిశిక్షింపుమా|
పరసౌఖ్యంబులభించుదీనివలనన్ భావింపదుర్మార్గుడా|| 89

శా|| దారన్నెత్తినిబెట్టుకొంచుజననిందారొంచుదూషింపుమీ|
సారాచారులదిట్టుదుర్వ్రతవరులంజకొంగభూషింపుమీ|

వీరున్వారనబోకకుత్సితతతిన్వీక్షించిపోషింపుమీ।
దూరంబై చనుమీఫలంపుపనికిన్ దుర్మార్గచూడామణీ॥ 90

మ॥ కనుమీకూకలొసంగివారసతులన్గారాముచేనిచ్చలున్।
వినుమీసజ్జనదూషణంబుశ్రుతికిన్ విందొప్పనేప్రొద్దునన్।
జనుమీకూడునునీళ్ళులేకజనులంజక్కాడగాలెస్సగన్।
మనుమీనావచనంబునీదగలుగున్ మర్యాదదుర్మార్గుడా॥

క॥ పండితమండలినెందుగ।
భండనమునబాధపెట్టివారిగృహములు।
ద్దండతమెరయగశిఖికిం।
బండువుసేసికడుపుబ్బపకపకనగుమా॥ 92

క॥ ఈవుగుడుపనిపదార్థము।
నీవసుధాస్థలిమరొక్కరేరైనగనం।
త్రోవంగనడ్డపడుపుము।
సూవృషమునుగడ్డియందుశునకముపగిదిన్॥ 93

గీ॥ నీదుదుర్మార్గనామంబునిజమటంచు।
ప్రజలుగుంపులుగూడుచుబలుకునటుల।
పలువిధములనేబోధించుపనులయందు
పట్టుబూనుమీనీపాడెకట్టుదాక॥ 94

ఆ॥ ఎక్కువగనుజెప్పనేలబల్కెదవిను।
మొక్కమాటలోననూరిశిష్య।

మంచిచెడ్డ చెడ్డమంచిగా జేసిన।
నిన్ను తెండ్రిదలను దన్నె నండ్రు॥ 95

ఉ॥ ఎచ్చటకేగ నన్నిసుఖలేంద్రఖరావరకు త్రిలోకోత్తమా।
ప్రముచ్చిలియాక తాంబుదారమూర్ఖ దుర్జనచక్రవర్తినీ!
చచ్చుటయెన్నడో గదరచక్కసినీతలమంటకన్నులిఁ।
పెచ్చుగజూతుమాయనుచునెల్లరుదీనవసేయునెంతునిక 96

వ॥ ఇట్లు దుర్బోధి పలుతెరంగుల నుపదేశించి స్వస్థానంబునకుం
జనియె నంత॥ 97

గీ॥ వాంతకులకు నెన్నగవిమబ్బినట్లు।
దొంగలకుజీకువాలులు దొరకినట్లు।
కోతులకు మద్యపానంబు గూడినట్లు।
పుడమిదుర్మార్గునకు గురుబోధమబ్బె॥ 98

గీ॥ తొల్లికన్న వేయిమడుగులల్లరిగను।
వాడురాజ్యంబుసేయంగ ప్రజలుతగ్గు।
గాములబొందిరిమందుకైనసుకమూన్య।
డెంపు లేడుదీనపలకుసందియంబు॥ 99

క॥ ఏజాడ శేడువడచును।
యాజాడనెలోకముండునారయగయథా।
రాజాతథాప్రజాయను।
భూజనవాదంబుపొల్లుపోవునెయధిప॥ 100

వ॥ అత్తరి॥ 101

చ॥ తనభువిజూడగాండ్రకును దంభుఁ కిత్తురటంచు లచ్చియుం।
దనుహృదయంబులో నెపుడు దాచుచునుందురటంచు వాణియుం
దనుపనిలేనికార్యముల ధారనుబోయుదురంచు శక్తియుం।
గినియుచు భర్తలన్వదలి ఖేదములన్వనభూమికేగగాన్॥ 102

గీ॥ కమలములులేనిసారసాకరమువోలె।
జీవనములేనిస్రోతస్వినీవిధాన।
తమపడంతులు లేకున్నతమగృహంబు।
లున్నకన్నారగాంచినిట్టూర్పులెగయ॥ 103

గీ॥ శక్తిశక్తియంచుచంద్రచూడామణి।
లచ్చిలచ్చియంచులచ్చిమగడు।
వాణివాణియంచువనజాసనుండును।
వగలతెగలమిగులపొగిలిరపుడు॥ 104

గీ॥ పడతిలేనియట్టిపండువుదండువు।
చానలేనియట్టిశయ్యకొయ్య।
పొలతిలేనియట్టిభోగంబురోగంబు।
భామలేనియట్టిగేముపాము॥ 105

క॥ అనిపెక్కుతెరంగులనా।
వనజాసనవాసుదేవభర్గులుచింతా।
వనధిమునిగికొంతదడువు।
మనమునదలపోసిగహనమార్గములరయన్॥ 106

క॥ ఒక్కరుపోయినజాడను।
రొక్కరెఱుంగకచనజననువిదానన్నుం'
చిక్కొనరించిచనదగునె।
యక్కటరావేయనియెడియార్తస్వరమున్॥ 107

క॥ వినినలువనాపగిదియా।
జనుడెవడోకాంతకొరకునంతాపమునన్।
వనములదిరిగెడుచూచెద।
నసిదవ్వులకేగియిట్టులనియెంబ్రీతిన్॥ 108

ఆ॥ అయ్యవారలెవ్వరడవిలోజరియింప।
నేలనన్నుబోలిజాలినొంది।
యనినతననుమూఢుడనియెంచివెన్నుండు।
గోలబెట్టనేలకొడుకుగుజ్జు॥ 109

ఆ॥ నాకుసుందరాంగినీవుప్రేముడితల్లి।
కడలిచూలినన్నుకడకుద్రోచి।
యిచ్చవచ్చినట్టులేగెదానెచటికో।
గానవడతికొరకుకదలినాడ॥ 110

వ॥ అనినబ్రహ్మయిట్లనియె॥ 111

గీ॥ పడతికైచింతనొందునిర్భాగ్యుశ్రుతికి।
తల్లివార్తలువినబడితెగనివెతల।
పాలొనర్చెసాగరమీదువానివీచి।
కలరుదెంచిముంచువగిదికట్టకట్ట॥ 112

వ॥ ఇట్లు పరమేష్ఠిపెద్దయుం బొఱిద్దునేలంబడి చింతిలుచుండ చే
తులుచేపవెత్తి బాలా యేలాయిూలీలగోలబెట్టెదవు చీకటు
లుపోయి వెన్నెలలురాకయుండునే మన మిరువురముకలిసి
లక్ష్మీసరస్వతుల నారయుదము రమ్మని వెన్నుండుసుతునితో
డ పయనంబై యీశాన్యాభిముఖంబుగా జనుచెడ॥ 113

గీ॥ అమలగుణశీలభక్తదయాలవాల।
మహితరిపుజాలమధుకరమంజువాల।
యేలయిూలీలవల్లిమలబాలరాదు।
కరుణయనిచింతిలుశివుండుగాననయ్యె॥ 114

క॥ అత్తరిఁజిత్తజజనకుడు।
చిత్తజవైరినిగనుగొని క్షేమముబావా।
తత్తడిలేకనెవచ్చితి।
వితైరగునహేతువేమియేర్పడచెప్పుమా॥ 115

క॥ అనవినిపురారిహరినిం।
గనిసీసైదోడుజాడగానకయిట్లీ।
వనభూములకేతెంచితి।
జననాంతరకర్మమిట్లునసల్పెనుబావా॥ 116

గీ॥ ముద్దుగుమ్మలేనవ్వులమోముజూడ।
కున్ననీమేనుపైయాసనున్నసువ్వే।
కూడునీళ్ళునులేక నేచేడెనెమకి।
దవులువ్యసనంబుచేపాండుతనుడనైతి॥ 117

వ॥ అనినమురారి యిట్లనియె॥ 118

గీ॥ అయ్యమేకమనుభామలనరయవచ్చి।
నారమీకాననగానము వారిచెందు।
మూఁడువంక్తులలిపియుండెము వ్వరకును।
నెక్కచందానలేలేందుఁషిక్కలేల॥ 119

క॥ అనిహరిహరునిఁగైతము।
తనవెంటనిడుకొనియేగెదారుణమగుకా।
ననసీమలకుంగాంతా।
గనకంబులపైనెవరికిగలుగవువలపుల్॥ 120

వ॥ ఇట్లుఁజనిచనివారు॥ 121

ఉ॥ చంకనుదుద్దుకఁ్జానుభుజంబునసల్లనిపెద్దకంబళిఁ।
పొంకముమీరనెత్తిపయిముంతనుబట్టిధరించిజొంపముగఁ।
చింకిరిచెప్పులందొడిగిచెప్పకనేతనగొల్లజాతిని।
శ్శంకముగాఁబ్రకాశమునుసల్పెడిగొల్లనిగాంచిరొక్కచోఁ॥

క॥ కనివానిపజ్జకుంజని।
వనమువనెంతైదెనగంపెవనిత్రాత్రితయం।
బునునావుడుగొల్లపలికె।
వనితలగినితలనుగానపలుకకుడింకఁ॥ 123

క॥ అల్లదెబాగుగచూడుడు।
నల్లనిమానులుగనపడునాచేచాయఁ।

మెల్లగనల్లనిమెట్టుని।
తెల్లనిదయ్యాలుమూఁడుతిరుగుచునుండున్॥ 124

సీ॥ అవిగనినయంతమూఁగుండెలదరుచుండు।
బమ్మరాకాసులే మొవమాపాలబడియె।
నీళ్ళునిప్పులేకనే పెక్కునెలలనుండి।
కాపురంబీడ నేయుండెకర్మమకట॥ 125

క॥ ఆపలుకులుదాఁజెవినిడి,
శ్రీపతిముద మొందిధాతశితికంఠులతోన్।
వాపోవజనదికయనిస।
మీవంబున కేగిగాం చెమొలతలనచటన్॥ 126

గీ॥ తావులనుబాసికీర్తులబాలుజేసి।
యడవులనుడాసిరావంగన్యాయమొక్కొ।
చండికారమూఘారతీసాధ్వులార।
పుణ్యవతులారయమరాగ్రగణ్యలార॥ 127

క॥ ఇటులంబెక్కుతెరంగుల।
కుటిలాలకలారయంచుగోలంబెట్టం।
గటగటయొకింతయుశ్రవణ।
పుటస్థలినిజేర్పరయ్యమువ్వురుసుదతుల్॥ 128

క॥ • అప్పుడుధాతసతినిముద।
మెప్పంగనిపల్కె నిద్దియువిదలకగునే।

చప్పుడుచేయకరమ్మిక।
తప్పులగునలువురులోనతరలకయున్న౯ 129॥

వ॥ అనిన సరస్వతి యిట్లనియె॥ 130

ఆ॥ చాలుచాలుమీవచనములురవ్వంత।
కట్టిపెట్టుడింకగుట్టులేల।
బట్టబయలుగాదెప్రజలచిత్తంబులో।
మెలగనింకనాదుతలముకాదు॥ 131

క॥ తానభ్యసించినచదువు।
దానంబీయంగలేకతనశిష్యులకు౯।
గానన్గుహావిత్తముంచం।
దానందనకుక్షిలోనదాచునకుడొగి౯॥ 132

వ॥ అంతరమాకాంత యిట్లనియె॥ 133

గీ॥ కుత్సితతతికిదుర్జనగోత్రములకు।
ద్యూతపరులకుసన్మార్గదూరులకును।
పొమ్ముటాలులకిత్తురుపుడమినన్ను।
వారిగీములవానంబుపడయలేను॥ 134

క॥ పదపడివరుగనిదుర్గా।
సుదతీమణితానుబల్కెక్షోణీస్థలినే।
బ్రతుకంగలేనుధూర్తులు।
మదమునకుపాల్పడ్డ్యపజ్జ్ఞమానువుమరుననుఃః 135

గీ॥ జగతిదుర్మార్గనామమువుడుచచ్చుదాక।
యిచటనేయుందుమందురానేలననిన।
దేవతలుమువ్వురచ్చటపావనముగు।
తపమునేయసాగిరిముందుదారిలేమి॥ 136

వ॥ ఇత్తెరంగున కాలవశంబున హరిహరబ్రహ్మలునైతము దు
ర్మార్గుండు విగతజీవుండయి ప్రజలుసన్మార్గవర్తనులగు పర్యం
తంబెన్నరానియుంగదల ననుభవించిరి కాదే యేనుగువేట
బడి కొట్టుకొనిపోవుచుండ నక్క పాటిరేవడిగిన చందంబు
గానుండె నీమాటలు గాన నికవగపుడుగుమని యూరడిం
చునవి వేకి హరిశ్చందనరేంద్రుండు తనువాతవృత్తాంతంబడిగి
న నతండిట్లనియె॥ 137

గీ॥ ధరనుదుర్మార్గునకునెప్పుదగుననంగ।
గలదుగాదిలిసంగడికాడుకుమతి।
నాగశ్వానములనుమించునమ్మకంబు।
చేతదనరుచుండునుదనచేతవలన॥ 138

వ॥ ఒక్కనాడు దుర్మార్గుండు తనసంగడికానితో గూఢధుత్తూ
రాస్ఫోటావల్లు జాజి గన్ధికోగ గన్ధానిర్విణ్ణా శ్వదంష్ట్రా వ
హ్నిసంజ్ఞికా భృంగరాజవిషాణీ కాకాంగీ వత్సాదనీ సంస్ప
ర్శదుః స్పర్శ హ్యాఘ్రపుచ్ఛ వజ్రద్రుమ ప్రముఖ నానావిధద్రు
మ విరాజితంబును దంశమూషికా కృకలాసోర్ణనా భకర్ణజ
లూకాశూకకీటకర్కరేటు సర్పవృశ్చిజగణ్డోలి భృంగారిజ్యో

తిరెంగిణ ముఖ్యజంతు సంతాన సంకులంబును నగువనంబు
నకుంజని యందలితరు విశేషంబుల నెచ్చెలికి జూపుచునిట్టు
లనియె॥ 139

గీ॥ ప్రసవమకరందమానంగభసలపఙ్క్తి।
ప్రాలిమఱమలమాడుచునేలమీద।
బడుటకతమునమ్మెదల్ ప్రచురనీల।
దేహకాంతులదనరుటదెలియనయ్యె॥ 140

ఉ॥ దానిసుసౌరభంబుజలెదానిదళాంచితశాఖికాప్రభల్।
దానినుమాళివృద్ధియుహదానిమధుస్రవతత్ఫలంబులున్।
దానివిశాలమూలములుధారుణినేలెరు:లందుగల్గున।
ధానికసింతచెట్టునుశదాతలపోయెరెచూడునెచ్చెలీ॥ 141

గీ॥ కాలుపెట్టినయంతనేతేలుకుట్టి।
నట్టిపోలికసలుపుచునహాహాయిచట।
నెందుజూచినకౌతుకమొందజేయు।
స్వాదుకట్టకతరువులుసంగడీడ॥ 142

గీ॥ వీకనున్మత్తతరువులయాకులెలమి।
తెచ్చిగిద్దెడురసమునుదీసిత్రావ।
తినడుఘునవామమంతసార్థకముగాక।
మనుజునున్మత్తుడై క్షణమరణమొందు॥ 143

క॥ మిక్కిలిజారత్వంబున।
లెక్కింపగకోటగోడలిలగదాటన్।

గత్తవగాయముగాఁగను।
జక్కఁగ దానికిఁ గసింతిసహాకారిగదా॥ 144

సీ॥ దొంగతసమును గావింపదొంగదొంగ।
యనుచునింటివారెల్లఁ నగువఁబరచు।
ఘనముగలవారివాలిటికల్పతరువు।
గానెయూరబొమ్మజెమ్ముడుఁబగంటెఘుమత్రి॥ 145

గీ॥ దేని కాయలవలనను దిట్లుమనము।
చవితిపండుగదినమ్ముంగ భువిని తింరు।
మట్టిపల్లేసుమానులనరసినావె।
నాడుగాదిలిచెలి కాడ మోద మెసఁగ। 146

క॥ సీతాకోకచిలుకలతి।
చేతఃకౌతుకముతోడ జెలగుచునుండుం।
ఖ్యాతిమయి తిరుగుచుండిన।
భూతలమునవీనిపొంకుపొగడఁ ద్వశమే॥ 147

వ॥ ఇట్లు వనవిశేషవీక్షణసౌఖ్యాబ్ధినోలలాడుసమయంబున॥148

చ॥ తొనతను కాంతిదళ్కులకు దగ్గఁ నల్లనిచాయసీయగా।
దనతనుగంధమింతెయును దాకినవారలుచచ్చుచుండగా।
దనచనుదోయివిశ్వమును తద్దయుశుభ్రము సేయుచుండగా।
జనుచెలినోర్తు గచ్చపొదచాటునఁగాంచి బతేబతేయనెన్। 149

సీ॥ ఉల్లిపనములో జోరిగయుండు ఫక్కి।
పరగనత్తులకొలనులో బకముభంగి।

కాకినుండుస్సృగాలముకరణినలరి।
యవ్వనపునమన్న కుమూషినరసియపుడు॥ 150

గీ॥ గుటకలనుమింగిరొట్టలకోట్లకొలది।
వేసిరోమముల్ భూదారవిధమునిక్క।
పొడవగాబ్రత్తికాయలబోలుకనుల।
రెప్పవేయకవీక్షించెనప్పుడెలమి॥ 151

గీ॥ గార్ధభముస్వరమునకన్నకడిదివేము।
రెట్లధికముగావిన్నైనెనట్లుదోచె।
మున్ను నాచేటచెవులకునెన్నదీని।
స్వరముకాబోలునాకారచాంచల్యము॥ 152

ఆ॥ దీనిబల్కరింపదిట్టునోకొట్టునో।
మెట్టునొసిగచేతబట్టుకొంచు।
నెగసితన్ను నొకదుపగచేతలాగును।
రక్కునొకనుపెట్టునిక్కమిపుడు॥ 153

సీ॥ కలికిమొగంబుశాఖామృగంబునుబోలు,
చెలియకన్నులనూదిబిలమునేలు।
కోమలికంఠంబుకొంక్కరలనుదూరు,
చెలిచన్నులుంసౌరకాయలనుగేరు।
కాంతదేహముచాయకరిదూపమునుమించు,
మెలతకరములుకట్టెలనుబెంచు।

చేడియమధ్యంబుచింత మొద్దునుఁ గోయు,
ముదితస్వరముఖరములనుదోఁచియు॥

సీ॥ ఔరయీయందమీచందమవనివదవ।
నాటిక్రొత్తవిధవకైననాస్తికాదె।
వగ్గుబమ్మ చేసగునెయీపగిదిదలప।
యమునిచేననితలఁచెదనతివసృష్టి॥ 154

॥ చానగాదిదిజముకోలనానగాని।
యింతిగాదిదియిడుములదొంతిగాని।
యన్నగాదిదివలకాటిమన్నగాని।
కొమ్మగాదిదిబోడిపెద్దమ్మగాని॥ 155

॥ చెలియవదనమిత్తడిసిబ్బిచెన్నుదన్ను।
సఖియకనుబొమల్ధ్వజములసౌరుగేఁ।
మెలతమైచాయబొగ్గులమించునొంచు।
నువిదనడకగాడిదనడమెప్పుదెప్పు॥ 156

॥ నడకలుపిచుకలబోలును।
నొడలన్నుదుమ్మకట్టిలోయననొప్పుం।
నడుమదిజెప్పందరమే।
గడుపెద్దగుమద్దిరోలుఁగైవడిదోఁచుౝ। 157

వ॥ ఇట్లాకురూపి సౌందర్యం బభివర్ణింపుచు పిసితఖండంబుడా
సినగృధ్రరాజముం బోలెదాని పజ్జకుడాసి॥ 158

గీ॥ ఇంతిపేరేమికాపురంబేడనడుగ।
గొబ్బిపిప్పిపన్నులజిగిగ్రుమ్మరిలగ।
బిందువులువర్షధారలై వెడలరాల।
యేఱులై పారతెన్నుగుడ్లెఱ్ఱజేసి॥ 159

క॥ తిట్టినతిట్టునుదిట్టక।
తిట్టెనుబోరలనుజాపితిన్నగపదివేల।
చట్టువలుబ్రద్ధలైచన।
గట్టాకాముకులకెంపుగలుగవృషనముల్॥ 160

వ॥ అప్పుడుదుర్మార్గుండిట్లనియె॥ 161

గీ॥ పడతినాలాయిచిత్తంబుబట్టియీడ్చె।
నీదుచూపుబరికొంకింతనెమ్మిలేక।
బిఱ్ఱబిగిసిచచ్చినబఱ్ఱెపిల్లబయిట।
కటికచండాలుడీడ్చెడికరణినకట॥ 162

ఉ॥ కోకిలమించుమైయొరపుకుక్కుటజాలమునొంచుకోపముల్।
జీకటిపెంచువాసమునుజిన్నెలుసన్నెలుజూడప్రాణముక్క్।
పీకుచునుండెనెప్పుడునుబిగ్గగవుంగలిహేపుజూపుమీ।
కాకనుపీడమీపడతిగాళ్ళనుగొట్టినమొద్దుకైనడిక్॥ 163

గీ॥ అతివనినుజూచినంతనెయాపురమని।
పొరలుపొరలుగాతోసంబుపుట్టెనుక్క।
పెట్టుగామాటిమాటికివిసుగులేక।
కరముకడుపునొప్పితెరలకరణిధరణి॥ 164

సీ॥ నీదురూపంబుగాంచిననిముసమందె।
తెరవనీయభిధానంబుదెలియదయ్యె।
తిమ్మనిమొగంబుఁజూచినత్రుటికలోనె।
వెఱ్ఱివిధవయైననుదానిపేరుగనదె॥ 165

గీ॥ ఇటులఁబాధించుదుర్మార్గునీసులెత్త।
మాతులకుచేతులనుసాచిముడితయపుడు।
బోర్లఁబడఁద్రోచెబాపురెపోలీసంచు।
లెక్కఁబోక్కెడురక్తంబుఁగక్కునట్లు॥ 166

క॥ ఈలీలన్నేలబడియు।
దాలేచిమెయితుడుచుకొనితరుణీరమ్మా।
క్రోలకనికాముకస్వరు।
బోలజ్జాయనుబుధోక్తిధ్రువముగనయ్యెన్ 167

గీ॥ ఇలనుశ్లేష్మంబులోఁబడ్డయీఁగరీతిఁ।
బరగఁగుడితిలోఁబడ్డబల్లిభాతిఁ।
గొరలిబోనులోఁబడ్డగిరికభంగి।
నవిదనీయందలితమునేనుంటినిపుడు॥ 168

గీ॥ వెఱ్ఱిపట్టినశ్వానంబువిధినిభూత।
మావహించినమనుజునిరీతిఁబండు।
నిప్పుఁద్రొక్కినప్లవగముచొప్పునిట్టు।
లున్ననామీఁదఁగారుణ్యముంచవేల॥ 169

గీ॥ పొలఁతి నేరేడుపువ్వులఁబోలు నీవు।
దృష్టిచేత నన్ను నొకింతఁ దేరి జూగఁ।
గంటివేని నేకాలంబు నింట నుండు।
పాడిబఱ్ఱెవగిది చూచువాఁడ నిన్ను॥ 170

క॥ నిన్ను మహామారిపగిది।
నెన్నఁగఁ జూచుచు నవిరళమ్ములలో నీకన్।
సన్నుతులఁ గుచు నుందును।
దిన్నఁగను చెప్పఁ క్రింది తెలువిధమునన్॥ 171

గీ॥ ఇట్లు బ్రార్థింపఁ బెడచెవిఁ బెట్టి యతివ।
పక్షిచందానఁ బఱువెత్తి పొదను మాటి।
లోపల నుదాగియుండ లోలోన దుఃఖ।
పడుచు దుర్మార్గుడు వెడలెఁ బడఁతికొఱకు॥ 172

ఉ॥ పొలుపగు తుమ్మలార విషముష్టిమహీజములార దీర్ఘపి।
చ్ఛిలతరులార గోక్షురకచిత్రకతూదములార సారఫే।
నిలమదనార్కపర్ణగుడనింబములార వరాకి మీఁదు నీ।
డలఁగని డాగియున్న యెడ డాయక చెప్పరె మీకు మ్రొక్కెదన్

సీ॥ సూచీబిలముఁబోలు సొగసుఁ గన్నుల దాని,
వీక్షించినారె జోరీగలార।
గార్దభముల దూరు గమనవైఖరి దానిఁ,
బరికించినారె కుక్కురములార।

కటిబొగ్గులనుగేరు కాయదీప్తులదాని,
వీక్షించితిరె కాకవితతులార!
దధిబాండమునబోలుతలనెరిసినదానిఁ,
జెలఁగికాంచితిరె కౌశికములార॥

గీ॥ పికపుమెకములుకొక్కెలుకొక్కరాయు।
వాకణంబులుక్రూకీంకీచికవాలు।
దివ్వెయార్పులుకూకటుగువ్వలార।
వెలఁదిఁగానరె మోపిల్లిపిల్లలార॥ 174

చ॥ అలమునుబారికిందవిలిహాసతిహాసతియంచరణ్యమున్।
గలదుఁచరించికాకములగద్దలనీక్రియవేడివేడిబి।
ట్టలుఁగునదేవుఁడాయనుచునంతయుఁబెద్దఁగనొంతునత్తివా।
డిలవిలపించెనశ్రుకణమేఘలుగాఁబ్రవహింపనత్తరిన్॥ 175

గీ॥ అతివనీకంపునాకింపటంచుఁజేరి।
నట్టినన్నెడబాయుటన్యాయమహానె।
నీవిఁకనురాకయున్ననీనిముషమునఁ।
చానగొంతుపినుకుకొనిచచ్చువాఁడ॥ 176

చ॥ అనియనివార్యమానమదనానలతప్తశరీరుఁడైమనం।
బునఁగలదుఃఖభారమునఁబొక్కుచుదిక్కులనెల్లఁజూచుచున్
వనమునఁగాంతగానమిశవంబువిధంబునవ్రాలిమూర్ఛలెం।
గననుకాళికాపదలుగాకసుఖంబుఖుగల్గఁబోవునే॥ 177

గీ॥ ఇటుల దుర్మార్గభూమీశుఁ డిలను వారిలు
నేమిదో చక్కసుమతి దా నేగిపొరి
వర్గమునకీయుగంతంబు బయలుపఱచె
శుంతలు విధవల సుజనిచూచి వానిఁ॥ 178

సీ॥ భూతంబు పట్టెనీవు గుర్వాధమునకంచు,
దయ్యాల ధర్మాలు తెన్నొ పలికె
వాటంబు హెచ్చెనీ పాటచ్చురు నకంచు,
వైద్యాల వంగయ్య వరుసను చేవె
గ్రహములు చాలవీరోత్తమునకటంచు
జోస్యుల సుందరయ్య సారిద చెప్పె
చప్పఁగాఁ జచ్చెనీ శగనోత్తముడంచు,
శవముల శంభన్న సాబె పడిగ॥

గీ॥ నప్పుడెల్లమ్మగారి పుల్లమ్మ యింటి
యాయ నెట్టెరు గ్రతచేతఁ బోయెననియె
కాదు నయమా యెమా విస్సిగాడి కప్పు
డంచుసూ రక్కగారి సుబ్బక్క పలికె॥ 179

గీ॥ అపుడు వింతలమారి వీరమ్మగారు
కారణంబును సుమతిని జేరి యడిగి
తెలిసికొని తురూపినెమకి తెచ్చి రాజు
నెపుటఁ బెట్టంగ లేచి వాఁడిట్టులనియె॥ 180

చ॥ మరుఁడు నిశాతబాణముల మాటికి మాటికి గ్రుచ్చె నావిభా।
కరుఁ డుకరంబు నాతపము గాయఁగఁ జొచ్చె నరిష్టగృధ్రజా।
తరవము లెల్ల దిక్కులఁ దారుణమై కడు హెచ్చె నీ దుసుం।
దరవును జూడ నాకిపుడు తప్పని మృత్యువు వచ్చె భామినీ॥ 181

సీ॥ ఈరీతిఁ బ్రార్థింపఁ గష్టంపడక యున్న,
కాంతను గడును గంగమ్మగారు।
చాడీల సాతాని శాంతాఫలముగారు।
తలగొట్లమారి కాంతమ్మగారు।
జగడాల జంగమ జమాజానికమగారు,
చక్కట్లమారి వాజమ్మగారు।
మొదలైన విధవలు మోవ వాక్యములాడి,
మొదలు విరిచి యొడంబడఁగఁ జేసి॥

గీ॥ పరిణయముహూర్తము ధ్రువంపఱచి పెండ్లి।
పనుల సటుఁ జేయఁ గడఁగిరి బ్రహ్మపెండ్లి।
ముడులు పెట్టఁ ద్రెంపఁగ స్త్రీలముండలనుగఁ।
గొందఱి నొనరించెనుగా దెక్షోణియందు॥ 182

క॥ ఆపెండ్లికి భూదివిజులు।
రూపాజీవలు దెసలను మ్రోతలు సెలఁగన్।
బాపురె యనఁగన్ వచ్చిరి।
బాపల నీగల గణికల పలయు నెపిలువన్ 183

సీ॥ పెట్టినఁబెండ్లియుఁబెట్టకుండినశ్రార్ధ,
మనిదయనిర్దయననెడివారు!
కాసుతక్కువనీయుగోసాఁబచ్చుతో,
రణములఁద్రెంపుచుఁబ్రబలువారు।
మొదటితాంబూలంబుమిట్టలేదంచుదో,
మ్రిదపయుష్ఠమునోట్లమెదవువారు।
మాయూరికెప్పుడుమామూలుశ్వేతంబు,
సంభావనయుటంచుఁజాటువారు॥

గీ॥ తాతముత్తాతలచెమటుఁబాతగిలిన।
రోతశాలునంసమునవారూఢివేసి।
శాస్త్రిభిదలనువచ్చిరచ్చటికివేడ్క।
వారములలోనమంగళవారరీతి॥ 184

ఉ॥ తట్టెడుబూదిపెట్టితనతాతలశాలువు బోడిబుఱ్ఱకుం।
జుట్టికకుద్రతిన్ జనులుఃచూచు తెరంగననంగవస్త్రిమున్।
గట్టివిచక్షణుండువలెఁగ్రంధముపొంకముమీరఁజంకలో।
బెట్టిముదంబుతోడఁబృథివీసురుఁడొక్కఁడువచ్చెనత్తరిన్॥186

గీ॥ ఎలమిఁబుంశ్చలీసుతులుశిష్యులయితన్ను।
గురువటంచునుగొనియాడగరువుమొప్ప।
లేచిసంభావనకుఁగేలుఁచాచెనప్పు
డఖిలదుర్గుణస్థానిపేరావధాని॥ 186

గీ॥ బ్రాహ్మణులకునొసంగుసంభావనంబు।

వ్యర్థమైనవ్యయము వెలపడఁ దులకును।
జ్రేమసిచ్చినఫలదము వీంద్రఁ బిలుత।
మంచుఁ బెద్దలు వేశ్యలనాడమనఁగ॥ 187

సీ॥ ప్రణములకీగలు ప్రాలఁ దోలుచొకర్తు,
లయ లేక చేట తాళంబువైవ।
లంకపుగాకును గొంకకనములుచుఁ,
బణ్యాంగనయొక తె పాటఁ బాడఁ।
గంటిపుసులెను మేల్కట్టు చేఁదుడుచుచు,
వెఱ్ఱిచూపులనొర్తు ఖిఁజ్రిచూడఁ।
బాదంబుకుంటిచేఁబడుచు లేచుచొకర్తుఁ,
శివముగొన్న విధానఁ జిందులాడ।

గీ॥ ప్రొకుకువలెరూప్యమీయంగ ముసలివాన్య।
గాడుతమపేరుఁ జనుపుచు గంతువైవ।
నీతపండ్లును నమలినకోతులవలెఁ
బండ్లనికిలించినగిరిసభాసదులట॥ 188

సీ॥ నాచాయువీక్షించియీచానదండంబు,
పెట్టలేదంచునుఁ బేలెనొకఁడు।
ముందుగానారూప్యమింనుఁ జదువలేదు,
పట్టువట్టెదనంచు వాగెనొకఁడు,
మొన్ననూరేగునప్పుడుగుమ్మమును దాటి,
నిలువఁబడిరటంచుఁ బలికెనొకఁడు।

వీండ్రయింటికిరాత్రివేళ్ళఁగామర్యాద,
చేయనే లేదంచుఁజెప్పెనొకఁడు।

సీ॥ తలకుఁబోఁగరెక్కఁగాపుఁదప్పకొక్కఁ।
తేపతలయంటినంగానితీరవన్ని।
రోగములటంచువిటజాతియూహఁజేసి।
గుడగుడాలోచనముఁజేయఁగడఁగెనపుడు॥ 189

సీ॥ గణికనృత్యంబుముగియనాక్షణమునందె।
పురముఁజేరంగమనముత్తరమునొంద।
మానినీమణితోడదుర్మార్గుఁడపుడు।
బంధువర్గంబువెంటరాబయలువెడలె॥ 190

క॥ అతడటుబోవుచునుండగ।
క్షితినొకవైఖానసుండుజీలులతట్టం।
గుతుకంబుననెత్తినిడుకొని।
వెతవచ్చుననుచువచించువిధమునవచ్చెన్॥ 191

క॥ అంగనతోఁగవగూడిన।
చెంగిలిదుర్మార్గురాకవినిపురజనులు।
పొంగుచుమూగిరిచుట్టును।
మొంగిలియాడనకునీగలేతెంచుక్రియన్॥ 192

శా॥ చేరన్వచ్చిరిమొంటిగోడకడదర్శిశ్రేష్ఠుంబదుర్మార్గునిన్।
మూరిరాగేసరచక్రవర్తినిఖిలుల్గోరాజవైవస్వతుం।

ఘోరాకారువిరూపుకుత్సితమతిం గుంజాంతసంచారునిన్।
దారాయుక్తునిజూడగానుయువతుల్ తండోపతండంబులై॥

గీ॥ కొట్టికొట్టకబిడకలగొంతిమోర్తు।
తిట్టితిట్టకమగనిని తెరవమోర్తు।
పట్టిపట్టక ద్వారంబుపడతిమోర్తు।
కాంతతోనున్న దుర్మార్గుగాంచిరపుడు॥ 194

గీ॥ మొండిగోడ పైనిలిచినముదితయొకతె।
పాడుదొడ్డిలోనుండినపడతియొకతె।
బొమ్మజెముడులకడనున్న పొలతియొకతె।
సుదతితోనున్న దుర్మార్గుజూచిరపుడు॥ 195

ఉ॥ కట్టినపుట్టమూడజెయిగాజులమోతలుపిక్కటిల్లగా।
బిట్టురయంబునంజనగ బ్రేముడికాంతలునవ్వుటాలకుం।
జుట్టుపశంక్తినువ్విసను జావగమోదినపేడముద్దచే।
గొట్టినతిట్టినంగనదుగోమలియొక్కతెదానునివ్వెరన్॥ 196

క॥ రవికుసుమాంబకయొక్కతె।
యువనిందుర్మార్గుమీదనంబకసుమముల్।
మిప్పులంగాబరపెనుసీ।
భవనంబురవికుసుమములపాలౌనసుచున్॥ 197

చ॥ కనుగొనవచ్చిదంపతులగామినియొక్కతెమత్తురాలుగా।
పునవెదజల్లెదాగనకపుష్పచయంబుమనంబులోవలం।

గనకసుమంబులేయనియోగాకనుఃభావుకసూచనంబులం।
గనియుకపినిమందిరముకాంచనసంయుతమౌనటంచునో॥ 198

వ॥ ఇట్లుదుర్మార్గుండుపౌరులొనర్చు సత్కారంబు లంగీకరించుచు నిజగృహంబునకుం జనియెనప్పుడినుండే వార్తవేల్పుల కెఱిం గింపనరిగెనో యనన పరాబ్ధిగ్రుంకె దుర్మార్గునకు నిషేకము వేళ సూచింపవచ్చిన జోస్యుడన చంద్రుండుదయించెనంత నా రాత్రికురూపిదుర్మార్గులు కేళికాగారంబునకుఁజనిరి తత్క్షణం బుగృహంబగ్ని దగ్ధంబయ్యె జాయాపతులునల్లు లచందంబు నమాడి కృతాంతనిశాంతాతిధులయిరి పిదప సత్ప్రభుండు రాజ్యంబునకువచ్చె ప్రజలుసుమనస్కులైరి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, తపంబుచాలించి తమసతులతోగూడ నిజ పదంబులకేగి సుఖంబున నుండిరని యువివేకి హరిశ్చంద్రున కుజెప్పె॥ 199

గీ॥ ఇలనుదుర్మార్గుకోలమునసెవ్వరేని।
గలరెయనిన్నపుడడిగినకలియుగంబు।
నందుఁనింటింటనూరూరనుందురయ్య।
వేలకొలదియుననియువివేకియనియె॥ 200

వ॥ తరువాత తన సమాగత కారణం బడిగిన యువివేకి యిట్లని యె॥ 201

గీ॥ కలహపురిగలడొకజన్నిగట్టులుబ్ధ।
నామధేయుడాతడుచిన్న, నాటనుండి।

మెరుగడుదినుటబెట్టుటయితరజనుల।
పొమ్ముకాసించుముష్టికిజోలిగట్టు॥ 202

క॥ ఎంతధనముండినఁగా।
సంతయుభోగంబులేకసంభావనకుం।
సంతోషంబునఁబోవుచు।
వింతకుపెత్తనముబూసిపెరచోరైనన్॥ 203

గీ॥ గొడ్డుచచ్చినరాభందుగోర్కెతోడ।
జేరుపగిదినాలుబ్బుడుచేరునెవ్వ।
రైనచచ్చుటదనచెవిలోనబడిన।
యంతనిల్లునిల్లాలినట్టెవిడిచి॥ 204

చ॥ శవమును జేరిబేరములుసల్పుచుభారముగానదీనికిన్।
నవరసునీయగాదగునునాయముబల్కితిదీనికేగదా।
బవళులురాత్రులుందిరిగిపండెనుబుణ్యమటంచువత్తుని।
య్యవసరమిట్లుసేయగద రయ్యమరొక్కటిచూతుమంచనున్॥

గీ॥ కొత్తకుండదడపగోర్కెనెటకునైన।
నేగికార్యమేమొయెరిగివారి।
తిన్నెపైనదానధిష్ఠించియుండును।
గాడుగాచునక్కకరణిధరణి॥ 206

గీ॥ రూకలిచ్చివివాహంబుజేకొనియెడి।
బీదసాదలకడజేరిపెద్దచూపు।

పేర్రిగనవలెననిపీకిపిండిపెట్టు।
బడుగుగొడ్డనుగాకఁబుపాడిచినట్లు॥
గీ॥ వెలులవేయునులేదనుపేలకొలది।
ధనముగైకొనువిటులనుదాన్చగర్భ।
ములనుభేధించిమాన్యభూములనులాగు।
వెధవలతోలినోములపంటవేల్పతండు॥
వ॥ అతనికివెర్రెమ్మయనుసతిగలదది॥
గీ॥ పతియలసిగీమునకురానబలమహావ।
తివ్రతాసిరోమణిగానదిట్టుగొట్టు।
మొత్తుజేరెడులేసిదుమ్మెత్తిపోయు।
బమ్మరాకాసిచందానపైనబడును॥
గీ॥ పందివలెవింటపొర్లాడుబ్లవగమువలె।
గంతులిడుమిడుతవిధముగొంతనొగురు।
కుక్కబోలెమొరుగుమిత్తిఫక్కచిందు।
లాడువెర్రెమ్మనుగడుసమ్మనగనొప్పు॥
ఆ॥ ఔరఔరయంచునట్టహాసముజేసి।
పండ్లుగవ్వగుత్తిపగిదివాఁిల।
ముద్దుపిసెమణ్ణుగుద్దులటంచును।
దద్దగుద్దుమాగనిదర్వుబట్టి॥
గీ॥ దాలిగుంటలోనేకులుదాచుచుండు।
కుండలోసగ్గిబెట్టుచువండుచుండు,

కుప్పగాల్చి పేలాలను కోరుచుండు,
నవని వెర్రెమ్మ తన పేరు సార్థకముగ॥ 213

గీ॥ చలికి పనిపాటల యెడల తెలివి సున్న,
గాని మగని నిదిట్టుటలోన కంచె,
జేసి యొగర వేయుట యందు నెవ్వరేని!
మొదటి తాంబూలమీవలె ముదితకెపుడు॥ 212

ఉ॥ ఓరిమురా త్రయోరికుజనోత్తమయో వైధవాధవాధమా!
సారము లేని యీ బ్రతుకు జాలును నింక నుజావవేరనిన్,
మాఱితినంగ గోత్రియుల మందల పండువ జేతునంచు నే,
నేరము వంక వ్రాసతికి నిప్పుల పూజలు సేయు నిశ్చలుల్॥ 213

గీ॥ భర్త నామంబు మానిని పల్కరాదు,
గాన బండ వెధవ ముండ్రికి బెట్టెలిండి!
పోత పీనుగ వత నాజ్ఞ ప్రేతి యంచు!
నిటుల మంగళహారతులిచ్చు నెపుడు॥ 21 4

ఉ॥ రాయను నేడ కేగితివి రాయను జెంతకు జీర జేరవే!
రాయను బల్కకుంటపొగ రాయను ముష్టికి నూరి వెంటపో!
రాయను మింగ టానికెది రాయను గావెడు నీళ్ళు మోచితే!
రాయను గాళ్ళు పట్టగద రాయను జీటికి మాటిమాటికిన్॥ 215

సీ॥ రోగమేమయిన రాదేమి బాగుగాను!
సంధి జని యుంచి యైన నుజావవేమి!

కఫముచేనై ననీవిష్ఠుకాలుపురికి,
జేరవేమిరాఛీయంచు జెలగితిట్టు॥ 216

ఉ॥ అద్దిరయెంతకాలమునకాయువుదీయకయీముగండనే,
మొద్దునుగట్టనామెడనుముప్పగదా వెలిసామినెమ్మికిం,
దద్దయుసంకటంబుగదదగ్ధము జేయుమువీనినంచు నే,
పొద్దునబ్రొద్దునుంగనును మొక్కులువేలకొలంది చేయుచున్

గీ॥ పెక్కుతరములనుండియు వెధవలైరి,
మాకులంబుననాచాలు రాకపోయె,
తలబఱువువదలకపోయెదైనమేల,
చిన్నచూపుచూచెననుచు జెలగితిట్టు॥ 218

ఆ॥ బిడ్డలున్నవారుబిడ్డలగడుగొట్టి,
తిట్టివారుమనసుదీర్చుకొంద్రు,
గొడ్డురాలుగానకోమలిమగనిసె,
తిట్టికొట్టిమనసుదీర్చుకొనును॥ 219

ఉ॥ తిట్టునునాపదంబులనుదిన్నగనెప్పుడుబట్టకున్నచో,
గొట్టుమనిడ్డెనిన్నుననుగూరిమినెత్తినిబెట్టకున్నచో,
పెట్టును చెంపపెట్టులను వేకువజామునలేవకున్నచో,
నెట్టును నింటనుండినినునేరమువచ్చినకొంచమైననున్॥ 220

గీ॥ ఈవునచ్చినచీకలోనింపుమీర,
పాడుమంగళసూత్రంబు బారద్రెంపి,

పప్పుబెల్లములఁగొని వేగవండుగంచు,
గొడ్డులాగుననమలెద మెడ్డెమోరి॥ 221

వ॥ ఇట్లు తిట్టినతిట్టు తిట్టకుండ నిత్యవ్రతంబుగా విరామము లేక తిట్టుచుఁ గొట్టుచు తన్నేకొట్టినాడీ కట్టడియుంచు రట్టుసేయుచు నుపపతులఁ దీసికొని వచ్చిన నానాభరణంబుల గైసేయుచు భర్తకుమృత్యుసదృశంబై యుండె॥ 222

గీ॥ వెలిచవులఁ లెప్పమరిగిన వెలది చెంత।
మగఁడుకాపురమును జేసి మనఁగలేఁడు।
దయ్యమొద్దనుబిడ్డలుధరణినెందు।
మసఁగవింటిమెకంటిమె మనుజనాథ॥ 223

క॥ ఈరీతినాలుమగలున్।
వైరంబులతోడనెప్డువసుమతినున్నన్।
గారాబుకూతురొక్కతె।
వారికిజనియించిమోదవార్నిధిదేల్చెన్॥ 224

గీ॥ పిల్లభూమిపయిబడినవెంటవెంట।
మూడుకాళ్ళముసలికిచ్చిముడినిపెట్టి।
డబ్బులాగవలెనటంచునుబ్బిబేర।
ములనుజాటుచాటునచేయమొదలుపెట్టె॥ 225

క॥ తనభర్తలుఁబుడిట్టుల।
గనికరమొకింతలేక కాన్పునసమ్మం।

బనిసేయుచున్నాడని।
మనజోక్తివివెఱ్రమవినిమండిపడిపతికిన్॥ 226
క॥ కనియారయేమిచేసితి!
చెనటీనాయెఱుకలేకశిశువునమ్మం।
గనునీపెత్తనమేనా।
యనిపైఁబడికాళ్ళచేతనటునిటుతన్నెన్॥ 227
అ॥ తనివిచనకయంతదండంబురోకలి।
బండలగొనితనదురెండుకరము।
లందుచావుచావుమంచుబిట్టలయంగ।
గొట్టెగొడ్డుబట్టిగొట్టినట్లు॥ 228
ఆ॥ గంటుకాలవేసికసికరముక్కంత।
లేకవాతబెట్టిలేచిపొమ్ము!
నీకునెలవులేదునీయబ్బగాడితో।
మొత్తుకొమ్మటంచుమోదెమరల॥ 229
వ॥ ఇటులగొట్టంబడిన లుబ్ధుండు తనసతీలలామ పాదంబులపై
బడి లేవక కంటనుండి నీళ్ళు శరీరంబునుండి రుధిరంబుదొరగ వ
లపోవుచునిట్టులనియె॥ 230
గీ॥ వినుదురాశపత్తసమంకువెలయునొక్క।
భూసురాగ్రణిధూర్తాఖ్యఁబొల్చుపుడమి!
కష్టవతినాగయతనికికాంతగలదు।
వారియన్యోన్యరాగంబుపత్తమెపొగడ॥ 231

వ॥ వారికిత్తొమ్మండుగురు పుత్రికలుగలరాసంతానములో॥ 232

సీ॥ ఒకదానిమూకవానికినిచ్చెనొకదాని,
నంధునకిచ్చెనునను వుగాను।
బధిరవరునకొక్క పడతినిచ్చెనునిండు,
వికలాంగునకునిచ్చె వెలదినొకతె।
కుష్ఠురోగునకిచ్చెకోమలినొక్కతె,
నొకదానివీక్షించి వెకలికిచ్చె।
పంగునకిడెనొక్కబాలనుముదమార,
నొకపుత్రిమందునకొసఁగనిచ్చె।

గీ॥ సంచులకొలందిరూకలుసంగ్రహించి।
పెండ్లి తాళ్ళుగట్టినవెను వెంటదోలు।
బర్రెపడ్డకుగట్టిగావలుపుగట్టి।
దోలువిధమునపేరాశధూర్తవరుడు॥ 233

వ॥ ఎనమండ్రవ పరిణయంబొసర్చి కడపటితొమ్మిదవ పిల్లకు॥ 234

క॥ దంతములురానిపిల్లకు।
దంతములూడినవరుండెతగ జోడంచుఁ ।
మంతనమునదలపోయుచు।
గాంతామణితోడనిల్లుగరకరిబలికెఁ॥ 235

గీ॥ పిల్లకారునెలలుచనెవృద్ధధవుని।
వెదకుసమయమువచ్చెను వెలదియేని।

కీర్తమెంతయున మ్ముద మెట్టులనిన।
కష్టపతి దానికిమిగులకనలిమదిని॥ 236

గీ॥ నాకుకాసులపేరునునయముకొంటి।
వేనియుండైనజచ్చినవానికైన।
నిచ్చికొమ్మనుసతిమాటకిచ్చమెచ్చి।
దేశదేశములనపుడుతిరుగసాగె॥ 237

గీ॥ కడుపుమాంసమునమ్మెడిఘనుడుధూర్త।
పతడుభార్యనువిడనాడియఖిలదేశ।
ములవెదకిగనెనల్లునిముసలివాని।
నీగలోకానబుండునీక్షించినట్లు॥ 238

గీ॥ నీవుసచ్చిననేపెద్దనిదురగొనిన।
పిల్లయిూల్గినినిందులోచిల్లిగవ్వ।
రాదుకాటికిబోయినవారిణివగిది।
యనుచురెండుపంచులుదెచ్చెనల్లునొద్ద। 239

వ॥ ఇట్లుధనంబునునల్లుని తనవెంటబెట్టుకొని స్వపురంబున కేగి వివాహప్రయత్నంబులొనరించి ముదిపెండ్లికొడుకుం బల్లకి యెక్కుమనిన॥ 240

క॥ కడుముదుకడగుటను నెడలు।
తడబడవడకుచును జేతదండముగొనుచుం।
బుడబుడపల్లకిజతికెల।
బడనప్పుడుపండుకోతివగిదిన్ మెరసెన్॥ 241

గీ॥ పెండ్లికూతుచిన్నదిగానభీతిచేత।
కుఱ్ఱొమొఱ్ఱొలబ్బయంచుగోలపెట్ట।
నపుడుపూత్తెమువులులేమియరసిపాత।
బోడియమపల్లకినినెక్కె వేడుకలర॥ 242

క॥ వారలబరుపునవల్లకి।
భోరునవంగిపెటపెటనిముత్తునియలుకాఁగ।
ధారుణిగూలిరిభర్తయు।
దారయువెధవయుఁబేడతట్టలపగిదిన్॥ 243

వ॥ ఆనిమిషంబుననే పెండ్లికొడుకేడుకట్లసవారినెక్కె పిదప వా
నిభోగంబుల నత్తమామ లనుభవించిరి కాన మనకట్టిదశ
యబ్బనీవేల బేలవై యుందు నామాటవినుమనిన వెఱ్ఱమ్మవి
నదమ్యె॥ 244

గీ॥ ఇటులలుబ్ధుడువెఱ్ఱెమ్మయీసుతెత్త।
పోఁసలువుచుండగపిట్ట।
పోఁపిల్లిదీర్చెననగపుత్రినియమ।
భటులుఁగొని జెచ్చిరితమదుపత్తనమున॥ 245

క॥ అకటాపదాలమాటా।
గికురించిమెలకుజనితివెఖేదముచేతన్।
వికలతబొందితివిచ్చట।
పకపకనగుచునొకసారిభాషింపగదే॥ 246

గీ॥ బిడ్డయెడనుగల్గినప్రేమచేత।
గామగానిదానివలనగలుగబోవు।
సౌఖ్యకారకైవాడెంతయుసొమ్మసిల్లి।
యకటవిలపించుదశదిశలాలకించు॥ 247

క॥ తనకూతుగొంచులుబ్ధుడు।
కనికరపుతలంబుజేరగానడువంగ।
గనివెర్రెమ్మవచించెను।
జనెదవటకుపిల్లతోడచయ్యననుచుఁ॥ 248

గీ॥ పెద్దవల్లకాటికిబోదుబిడ్డనచట।
పెరుగగానుంతుకోన్నాళ్ళప్రేమవీడు।
మనుచుదానికిబోధించియరిగిశవము।
బూడ్చిదాదలచినధనముసకుగాను॥ 249

వ॥ ఖననంబయి సొంతయింటికి వచ్చిన యనంతరంబ॥ 250

క॥ దినదినముపిల్లనడిగెడు।
తనభార్యకుబ్రేతభూమిఁదాచితిననుచుఁ।
వినయంబుగపల్కునిరతి।
జనుచుండుననుదినమెంచసంభావనకుఁ॥ 251

గీ॥ అదియుభర్త్తమాటనున్నమ్మియాత్మజాత।
పెద్దవలిలకెలయుండుండివెలదియయ్యె।

రామరుద్రునకంచు నురంజిలంగ,
సాగినపిదపనొకనాడుసంధ్యవేళ॥ 252

ఉ॥ వారుడొకండుమార్గమునవచ్చుచు వెర్రిమయింటిలోపలం
గూరిమిభోజనంబడుగ గొట్టుచు తిట్టుచు వెళ్ళగొట్టగా
పారకతిన్నెపైనతడుబబ్బానగాగనిపొమ్మటంచుశ్వం
గారపుకట్టుగొట్టిజనకాపురమేడనవల్ల కాడనేః॥ 253

గీ॥ అవచసమును వెర్రెమ్మయాలకించి
కూతుకాపురమునసుండెకొర్కెనచట
గంటివెరామరుద్రునగారమందు
ననగనేరామరుద్రుండనాత్మభవన
మందునున్నదనివచించెనవనిసురుడు॥ 254

గీ॥ అయ్యొనాయననీవాయటంచుజేర
జీరిమృష్టాన్నమునుబెట్టచిన్నపట్టి
కేమయినభూషణములున్న వేయసంగ
నత్తబీదవారికెటులమరునగలు॥ 255

క॥ అనిపెక్కువిధంబులవే
దనుబోలెనటించిబొంకిదానినగల్గె
క్రొనిమున్నందివెసంజనె
గన్నకెతపుతేరివలసగాంచరుధనముల్॥ 256

గీ॥ నెత్తిమాటతోలుబ్ధుండునెలవుజేరి।
దివ్వెలేనికంబముభంగితెరవయుండ।
గారణమడిగికొంపనిష్కారణముగ।
గూల్చివేసితివీవంచుగోలబెట్టె॥ 257

ఆ॥ ఏడకూతురల్లుడేడచచ్చినపిల్ల।
మఱలబ్రదుకగలదెమహినినందు।
చాలుచాలుకూతుసాకునమృతినొంద।
యోగమబ్బసయ్యోయువిదమనకు॥ 258

ఆ॥ ముల్లెపాట్టబెట్టిపోసికొంటివెనీళ్ళ।
టంచునెత్తిమొత్తుకొంచురొమ్ము।
బాదుకొనుచునాల్కబారకొలందిని।
లాగికొనుచునంగలార్చువాడు॥ 259

క॥ ఆమాటలువినివెర్రిమ॥
భూమింజితిబేర్చియుద్దైబొందినివిడిచెన్।
జీమంత్రైనవెరదొరగి।
వ్యామోహంబెట్టికర్తపడయుదుజగతిన్॥ 260

గీ॥ జ్వరముతోడనెవచ్చెడిచలినిబోలె।
నేనునీతోడవచ్చెదనెలతయంచు।
వ్యయములోవ్యయముకలిసివచ్చెననుచు।
పండునిప్పులమీదపన్నుండెవాడు॥ 261

గీ॥ వారుసచ్చిదయ్యాలయిబట్టినన్ను।
పీకుచుందురుగానతద్భీతివచ్చి।
నాడగరుణింపవేయుననుచుసూర!
డించిబంచెహరిశ్చంద్రనృపతియపుడు॥ 262

క॥ అనికతనేతరియిక్కత౯।
జనువృప్పఁగబానవాలుసాములకెలమ౯।
వినిపించినవారుదనివి।
చనిచనిరంతందమతమసదనంబులకు౯॥ 263

సర్వమేకాశ్వాసము,

సంపూర్ణము.

---

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర విరచితము.